Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యూం I.]　　మద్రాసు : 1941 వ సం॥ ఏప్రిల్ నెల 12 వ తేది శనివారం　　[నె 4 రు

## ఈ వారంలో యుద్ధ వార్తలు.

### శత్రురాజ్యాలపై విమానదాడి.

బ్రిటిషువిమానా లీవారం ఫ్రాంసు కోస్తా రేవులమీద, జర్మనీలోని పారిశ్రామిక పట్నాలమీద తీవ్రతరమైన దాడులు సాగించాయి. బ్రిటిషు వైమానికులు క్రొత్తగా కనిపెట్టిన పెద్దరకపు బాంబులు యీసారి వేసేరు. ఇట్టి బాంబులు యిదివరకు యెక్కడా వుపయోగించలేదు. ఇదివరకువాటికంటే ఇవి అనేక రెట్లు యెక్కువ ప్రమాదం కలిగిస్తాయి. ఒక్కొక్క బాంబు ప్రేలిన, మైలు దూరంలోవున్న యిండ్లనుగూడ నిర్మూలం చేయగలదు. గత మంగళవారం రాత్రి జర్మను కర్మాగారాలు గల బ్రిమెను పట్నంపై వీటిని మొదటిసారి వుపయోగించేరు. వాడను రేవులో నౌకానిర్మాణ ఫ్యాక్టరీలపైగూడా వేసేరు. ఆ బాంబులు ప్రేలుతూవుంటే ఇండ్లకు ఇండ్లే ఆకాశంమీదకు ఎగిరి క్రిందపడడం ప్రారంభించాయి. అపుడు లేచిన మంటలు మూడు నాల్గు వీధులవరకు వ్యాపించాయి. అనేక భవనాలకు నష్టం కలిగిందని జర్మనులుకూడా ఒప్పుకున్నారు. జర్మనీ వాయువ్య భాగమునందున్న బ్రిమర్‌హావెను, ఓల్డెన్ బర్గు అను పారిశ్రామిక పట్నాలమీద, హాలెండునందలి రాటెరడాం రేవుపట్నంమీదగూడ దారుణమగు బ్రిటిషు విమానదాడులు జరిగాయి.

గురు శుక్రవారం రాత్రులలో బ్రిటిషు విమానాలు తిరిగి శత్రు రాజ్యాలపై దాడి జరిపాయి. ఫ్రాంసు రేవులను జర్మనీ ఉపయోగిస్తున్నది. అట్లాంటికు సముద్రంలో బ్రిటిషువారి నౌకలను నిరోధిస్తున్న జర్మను యుద్ధ నౌకలు షారన్‌హారుస్టు, నీసేనూ అనునవి ఫ్రాంసుతీరమందు బ్రెస్టు రేవులో వున్నాయని తెలిసింది. అందుచేత బ్రిటిషు విమానాలు ఆ రేవుపై వందలకొలది బాంబులను వర్షం కురిపించేయి. గురువారం రాత్రి మేఘాలచే బాగా కనబడలేదు కాని, మరునాడు రాత్రి ఆ రెండు నౌకలు పైనుండి బాగా కనిపించేయి. వాటిపై బాంబులువేయగా ఒకదానివద్ద లేచిన మంటలు 80 మైళ్లి దూరానికిగూడ కనిపించేయి.

గ్రీసియను దీవులవద్ద ఒక జర్మను యుద్ధ నౌక, ఒక సరకు సప్లయి నౌక విమానాలచే ముంచబడ్డాయి.

### జర్మను విమానదాడి.

జర్మను విమానాలు యీవారంకూడా ఇంగ్లాండుపై దాడి సాగిస్తునేవున్నాయి. కాని యిదివరకువలె పెద్ద దాడులు జరుపలేకపోయినాయి. ఈశాన్యదిక్కున ఒక నగరంపై తీవ్రంగా బాంబులు వేశాయి కాని, ఎక్కువసేపు వుండలేదు. ఆస్తులకు కొద్దిగా నష్టంకలిగినా ప్రాణనష్టం యెక్కువ లేదు. 2 వ తేదిన జర్మను వైమానికులు క్రిందుగా ఎగురుతూ దక్షిణ తీరాన్న విమానాశ్రయాలను ధ్వంసంచేయాలని ప్రయత్నం చేశారు. కాని విమానాశ్రయాలలో దేనికీ ఎక్కువ నష్టం కలుగలేదు. బుధ గురువారములందు ఇంగ్లాండు తూర్పు రేవులందు అక్కడక్కడ స్వల్పంగా బాంబులు పడ్డాయి. గురువారం శత్రువిమానాలు నాల్గుగంటలసేపు బ్రిష్టలురేవుపై దాడి జరిపాయి. ప్రాణనష్టం ఎక్కువ లేదు. కాని ఆస్తులు చెడ్డాయి. 15 దినాల్క్రిందట ప్లిమతు రేవుపై జరిగిన దాడి తరువాత, పెద్ద దాడి యిదే.

మార్చి నెలలో ఇంగ్లాండుమీద ఎగిరిన జర్మను విమానాలు 71 పడగొట్టబడ్డాయి. బ్రిటిషు విమానాలలో 6 పడిపోయినాయి జర్మనీమీద దాడిలో 16 జర్మను విమానాలు శిథిలమయినాయి. 45 బ్రిటిషు విమానాలు పడిపోయాయి. సముద్రంమీద జర్మనులు 3 విమానాలు గోల్పోయినారు. బ్రిటిషువారు ఒక్క దానినే నష్టపోయిరి.

### ఆల్బేనియా రంగం.

ఆల్బేనియాలో 1 వ తేదిన ఒకచోట 200 ఇటాలియను సైనికదళం పూర్తిగ నిర్మూలం చేయబడింది. చిన్న పోరాటమేతప్ప పెద్ద యుద్ధానికి ఇటలీ సైనికులు ఎక్కడా దిగలేదు. ఈ పోరాటంలో వందలకొలది ఖైదీలను ఆయుధ సామగ్రితోగూడ గ్రీకులు పట్టుకోగల్గిరి.

మార్చి నెలలో మధ్యప్రాచ్యరంగంలో 178 ఇటాలియను విమానాలు పడగొట్టబడ్డాయి. దీనిలో 98 ఆల్బేనియాలోనే, 34 మాల్టాలోను, 31 తూర్పు ఆఫ్రికాలోను పడగొట్టబడ్డాయి. బ్రిటిషు విమానాలు 19 మాత్రం నష్టమైనాయి.

### లిబియా.

ఉత్తర ఆఫ్రికాయందలి లిబియాలో మాత్రం బ్రిటిషు సైన్యాలు బెంఘాజీరేవునువదలి వెనుకకు రావలసివచ్చింది. లిబియా అసలు ఇటాలియనులది. దాని సరిహద్దులనుండియే ఇటాలియనులు మూడు మాసాల్క్రిందట ఈజిప్టుమీదికి దాడి తీయాలని ప్రయత్నించేసేరు. చాల సైన్యాలు అక్కడ కేంద్రీకరించి ఉంచేరు. కాని వేవలుసేనాని ఆధిపత్యంక్రింద ఈజిప్టునందలి బ్రిటిషు సైన్యాలు గత జనవరి మాసంలో ఆకస్మికంగా ఇటాలియనులపైబడి పూర్తిగ ఓడించి సుమారు 300 మైళ్ల పొడుగున బెంఘాజీవరకు లిబియా తీరాన్ని ఆక్రమించాయి. ఫిబ్రవరి 6 వ తేదిన బెంఘాజీ రేవు బ్రిటను స్వాధీనమైనది. గత రెండు వారాలలో జర్మను సైన్యాలుకూడా, లిబియాలోదిగి ఇటలీ సైన్యాలతోకలసి పైకి రావడం ప్రారంభించేయి అందుచేత బ్రిటిషు సైన్యాలు 3 వ తేదిన బెంఘాజీని ఖాళీచేసి వెనుకకు తగ్గినవి. ఇది యొక చిన్న పరాజయంగానే పరిగణించాలి. కాని యిందువలన శత్రువులకు కలిగే లాభం ఏమీ లేదు. బ్రిటిషు వారికి కలిగే నష్టం లేదు. లిబియా అంతా ఎడారి. అది ఎవరి చేతులలోవున్నా ఒకటే. కాని బ్రిటిషు సైన్యాలు బెంఘాజికి తూర్పున ఎక్కువ అనుకూలమైన ప్రదేశాలలో నిలచి శత్రువులను ముందుకు రాకుండా అరికట్టినవి.

శత్రువులు కొన్ని వారాల క్రిందటనే యీ దాడి సాగించివుంటే వారికి కొంత లాభించేదేమో. అపుడు బ్రిటిషు

వారు తమ సైన్యాన్ని కొంత లిబియా సరిహద్దులలోను, మరి కొంత తూర్పు ఆఫ్రికా రంగాలలోను ఉంచుకోవలసి వచ్చేది. బ్రిటిషు సైన్యాలు తూర్పు ఆఫ్రికాలో ఇటాలియను సామ్రాజ్యాన్ని ఆక్రమించడం కష్టమయ్యేది. ఇపుడు తూర్పు ఆఫ్రికాలో ఇటాలియనుల ఇరిట్రియా ఇంచుమించు పూర్తిగ బ్రిటిను స్వాధీనం అయిపోయింది. అబిసీనియా ఆక్రమణం కూడ ముగియవస్తున్నాది. అందుచేత లిబియాలో యీ శత్రు దాడి తూర్పు ఆఫ్రికాలో ఇటాలియను సామ్రాజ్య రక్షణకేమి ఉపయోగింప లేదు. అదీకాక కేవలం స్థానికమగు యీ స్వల్ప జయాపజయాలవలన తుదిఫలితంలో మార్పుండదు. అసలు ఫలితం, కొద్ది రోజులలోనే ప్రారంభించబోయే మధ్యధరా ప్రాంత యుద్ధాలమీదనే ఆధారపడి వుంటుంది.

## ఆఫ్రికా రంగం.

తూర్పు ఆఫ్రికా యుద్ధ రంగాలలో బ్రిటిషు సైన్యాల విజయ యాత్ర నిరాఘాటంగా సాగుతున్నది. అన్ని రంగాలలోను ఇటాలియను సైన్యాలను వెనుకకు తరుముకొనిపోతున్నారు. ఇరిట్రియా రాజధానియగు అస్మారానగరాన్ని గతవారం స్వాధీనపరచుకొన్న తరువాత బ్రిటిషు సైన్యంలో కొంతభాగం ఉత్తరం వైపునవున్న మసావా రేవు పట్నాన్ని ఆక్రమించడానికి బయలుదేరాయి. అది ఒక్కటే యిపుడు ఎర్ర సముద్రంలో ఇటాలియనుల చేతులలోవున్న పెద్ద రేవుపట్నం. అక్కడ సుమారు 40 ఇటలీ నౌకలు, కొన్ని జర్మను నౌకలుగూడా వున్నాయి. యుద్ధంలేకుండా మస్సావాను కూడ స్వాధీనపరుచవలెనని బ్రిటిషు సేనానాయకులు కబురు పంపితే ఇటాలియను అధికారులు అంగీకరింపలేదు. అదికాక అస్మారానుండి మసావా రేవునకుపోవు బాటలో ప్రతిబంధకాలుకూడ నిర్మించారు అందుచేత బ్రిటిషు సైన్యాలు అనుకున్నంతవేగంగా మస్సావా రేవును ఆక్రమించుకోలేకపోయినవి. ఇరిట్రియాలో యింకను మిగిలియున్న ఇటాలియను సైన్యాలు మస్సావా వైపునకుగాక దక్షిణంగా వెనుకకు పోవుచున్నవి. అందుచే మసావా రేవు ఎక్కువ ప్రతిఘటన లేకుండానే బ్రిటిషు సైన్యాలకు స్వాధీనంకావచ్చు.

• అబిసీనియా రంగంలోగూడ ఇటాలియనులు అనుకొన్నంతగ ప్రతిఘటించలేకున్నారు. ఉత్తరమున హరారు, డిరిడివా పట్టణములు వదలి రాజధానియగు అడిసు అబాబా వైపునకు మరలిపోయిన ఇటాలియనులు, "అవాష్" నదివద్ద ప్రతిఘటిస్తారేమో అని అనుకున్నారుకాని బ్రిటిషు సైన్యాలు ఎక్కువ ప్రతిఘటన లేకుండనే 5 వ తేదీన ఆ నదిని దాటినవి. అక్కడనుండి అడిసు అబాబాకు 90 మైళ్లు దూరం మాత్రమే వుంది. రాజధాని నగరానికి కొంత దూరంలోవున్న చరిత్ర ప్రసిద్ధమగు అడోవాదుర్గాన్నికూడా ఆ రోజునే పట్టుకున్నాయి. 1896 లో, అబిసీనియాను జయించడానికి ఇటాలియనులు ప్రయత్నించినపుడు అబిసీనియనులు యిచ్చటనే పెద్ద ఇటాలియను సైన్యాన్ని నిర్మూలం చేసి పూర్తిగా ఓడించేరు. నాల్గు సంవత్సరాల క్రిందట ఇటాలియనులు యీ దుర్గాన్ని స్వాధీనం చేసుకున్నపుడు గొప్ప ఉత్సవాలు చేసుకున్నారు. దక్షిణాన కెన్యా వైపునుండి మరి ఒక బ్రిటిషు సైన్యం అడిసు అబాబా వైపునకు వచ్చి, 5 వ తేదిన ఆనగరాన్ని వశపరచుకొన్నది. ఇటాలియనులు ఏ వైపునగూడ బ్రిటిషు సైన్యాలను ఎదిరించి నిలువలేకున్నవి. అబిసీనియా దేశంలో ఎక్కువమంది క్రైస్తవులు, మహమ్మదీయులున్నారు. నాలుగేండ్ల క్రిందట ఇటలీ యీ దేశాన్ని ఆక్రమించింది. అబిసీనియా చక్రవర్తి హాలీ సెలాషిగారు లండను పారిపోయిరి. ఇపుడు ఇంగ్లీషువారు అతనికి సహాయంగాపోయి అబిసీనియాను తిరిగి ఆక్రమిస్తున్నారు.

## యుగోస్లోవియా గ్రీసులపై, జర్మనుదాడి.

జర్మనీ, 6 వ తేది ఉదయం యుగోస్లోవియామీద, గ్రీసుమీద. యుద్ధం ప్రకటించింది. ఇదివరకు అయిదు నెలల నుండి గ్రీసుపై యుద్ధం సాగిస్తున్న ఇటలీ, ఇపుడు యుగోస్లోవియామీద గూడ యుద్ధం ప్రకటించింది. యుగోస్లోవియాను ఇటలీ పడమటి వైపునుండి, జర్మను సేనలు తూర్పు-ఉత్తర దిశలనుండి, సరిహద్దులదాటి దాడి సాగించినవి. మరికొన్ని జర్మను సేనలు బల్గేరియామీదుగా, గ్రీసునందలి తూర్పు ప్రాంతం పైకి నడుచుచున్నవి. జర్మనులు ఈ విధంగా దాడి వస్తారని తెలిసి, గ్రీసు తూర్పు భాగంలో, బ్రిటిషు ప్రభుత్వంవారు మూడు లక్షల సైన్యాన్ని చేర్చియుంచారు. ఆఫ్రికా రంగాలలో ఇటాలియను సైన్యాలను రూపుమాపిన వేవలు సేనాని యీ సైన్యాలకు నాయకత్వం వహించాడు. గ్రీసు రంగంలో బ్రిటిషు సేనలు కడుతీవ్రంగా ప్రతిఘటిస్తున్నవని జర్మను అధికారులే ప్రకటిస్తున్నారు.

## తటస్థ దేశాలు.

బాల్కనులలోకి ఈవిధంగా యుద్ధం వ్యాపించడం టర్కీకి అలజడి గల్గిస్తున్నది. సరిహద్దులను బందోబస్తు చేసుకుంటున్నది. బ్రిటిషు అధికారులు కావలసిన సహాయం చేయడానికి నిరంతరం టర్కీ అధికారులతో సంప్రదిస్తున్నారు. యుగోస్లేవియాపై జర్మనుదాడి సోవియటు రష్యాకుకూడ ఏమాత్రం ఇష్టంలేదు.

## అమెరికా.

అమెరికా యునైటెడు స్టేట్సు ప్రభుత్వంవారు, యుగోస్లోవియా గ్రీసులపై జర్మనుదాడి, దురాక్రమణయని ఖండించారు. బాల్కను రాష్ట్రాలలో యుద్ధం సాగించడం, జర్మనీకి అనుకూలంకాదని, వినాశకరమగుతుందని యునైటెడు స్టేట్సు విదేశాంగ సంఘ సభ్యుడగు సెనేటరు జార్జిగారు అన్నారు. యునైటెడు స్టేట్సులో అక్కడక్కడ ఫ్యాక్టరీలలో జీతాల హెచ్చింపుల కొరకు సమ్మెలు ప్రారంభమైనాయి. అయినా క్రిందటి నెలతో పోల్చిన యెడల విమానాల ఉత్పత్తి మార్చి నెలలో 1:000 నుండి 1,250 కి హెచ్చింది. దీనిలో చాలభాగం బ్రిటనుకు, గ్రీసుకు పంపుటకు అధికారులు నిశ్చయించుకున్నారు.

## దూరప్రాచ్యం.

త్వరగా తిరిగిరావలెనని. జపానునుండి సందేశంవచ్చుటచేత, జపాను విదేశాంగ మంత్రియగు మట్సు ఓకాగారు

ఐరోపాలో తన పర్యటనాన్ని వెంటనే ముగించుకొని, స్వదేశానికి బయలుదేరాడు. త్రోవలో మాస్కోలో 6 వ తేదీన ఆగి, సోవియటు నాయకులతో మరల సంప్రదింపులు సాగించాడు. దూర ప్రాచ్య వ్యవహారాలు విషమించుటయే మట్సు ఓకాగారి పర్యటనంలో ఈ మార్పుకు కారణమను కుంటున్నారు

---

# యుగోస్లావియా గ్రీసు దేశాలమీద జర్మనీ దండెత్తడం.

పోయిన ఆదివారం ఉదయం జర్మనీ సైన్యాలు, యుగోస్లేవియా, గ్రీసు రెండు దేశాలమీద దండెత్తాయి. యుగోస్లేవియాకు ఉత్తరాన ఉన్న హంగేరీదేశం, తూర్పున ఉన్న రుమేనియా, బల్గేరియా దేశాలు, జర్మనీకి బానిసలై దేశ పోవడంచేత ఆ దేశాలలో యుద్ధ యంత్రాలుగల జర్మన్ సైన్యాలు, వాయు విమానాలు చాలా వున్నై.

• ఈ దండయాత్రకు కారణాలేమిటంటే—

1. యుగోస్లేవు గవర్నమెంటు, ఆ దేశంలో కొద్దిగా వున్న జర్మనులను బాధపెట్టడం. అయితే, యుగోస్లేవు గవర్నమెంటును, అక్కడి జర్మన్ దేశీయుల నాయకులుకూడా యిది అబద్ధపు నేరారోపణ అన్నారు.

2. యుగోస్లేవు ప్రజలు జర్మనీకి దాసులము కామన్నారు. పీటరు రాజు ఆధిపత్యంక్రింది యుగోస్లేవు గవర్నమెంటు అంతకుముందు జరిగిన రాజీని త్రోసివేయకపోయినా, క్రొత్త గవర్నమెంటు తన ఉత్తరువులను పాటించదని, జర్మనీ దండయాత్ర చేసింది. హిట్లరు ఎంత దుడుకు మాటలనైనా మాట్లాడుతాడు. యుగోస్లేవియాలో ఉన్న దుండగీంద్రుడును, బ్రిటను దేశీయుడు ఒక్కడుకూడా, ఆ దేశంలో లేకుండా పోతేనేగాని జర్మన్ సైన్యాలు తమ ఆయుధాలను క్రిందకు దించకూడదని జర్మన్ సైన్యాలకు ఉద్బోధించాడు. యుగోస్లేవియా చిన్న దేశం. 12, 13 లక్షల సైన్యం ఉంది. అంతా బలాఢ్యులు, భయమెరుగనివారే. వారికి ఆయుధాలున్నైగాని, టాంకులను కొట్టే యంత్రాలు మొదలైన ఆధునిక పరికరాలు లేవు. వాయుదళంకూడా ఉంది. తమ స్వాతంత్ర్యాన్ని కాపాడుకోవాలనే ఆశ, ధైర్యం, జర్మన్ దాడిని అరికట్టవచ్చును. యుగోస్లేవియా ముఖ్యపట్టణం అయిన బెల్గ్రేడు యుద్ధం చేయదన్నాకూడా, జర్మనులు దానిమీద బాంబులను వేశారు. గ్రీసుమీద దండయాత్రకు కారణం, బ్రిటీషు సైన్యాలను ఆ దేశంలోకి రానివ్వడమని జర్మనులంటారు. కాని, హిట్లరు చాలాకాలం క్రిందటే దానిమీద దండయాత్ర చేయడానికి ఏర్పాటు చేసుకొన్నాడు. జర్మన్ సైన్యాలు త్రేసులోకి వెళ్లి గ్రీసును తాకుచున్నాయి. గ్రీకులు స్ట్రూమా లోయలో శత్రువులను ధైర్యంగా ఎదుర్కొంటున్నారు. స్ట్రూమా అనేది బల్గేరియానుండి గ్రీసుకు పోయే ఒకనది. ఇటలీ సైన్యాలమీద తమ బలాన్ని, పట్టుదలను చూపించిన గ్రీకు సైన్యాలు జర్మనులకుకూడా తగిన జవాబు చెప్పగలవు.

ఈ బాల్కన్ యుద్ధంలో కొన్ని అనుకూలాలున్నాయి. బ్రిటను యుగోస్లేవియాకు సహాయం చేస్తాననడం ఒకటి, బ్రిటిషు సైన్యాలు యిప్పుడు గ్రీసుదేశంలో ఉండడం రెండోది. బ్రిటిషు సైన్యాలు యీ దేశంలో చాలాకాలంగానే ఉన్నాయి. కాని శత్రువులకు తెలియకూడదని యీ విషయం వెల్లడిచేయలేదు. ఆఫ్రికా యుద్ధం చాలామట్టుకు అయిపోయింది. అచ్చటి బ్రిటీషు సైన్యాలును, సామ్రాజ్యమునందలి యితరదేశపు సైన్యాలును, బ్రిటీషు ఓడలమీద గ్రీసులోనికి చేర్చబడుచున్నాయి. బాల్కన్ ప్రదేశంలో ఉన్న బ్రిటిషు వాయుదళాలుకూడా బలపరచపడ్డాయి. బ్రిటీషు నావికా దళాలుకూడా జర్మనీకి వ్యతిరేకంగా కావలసినంత సహాయం చేస్తయి. తనకు తోడైన మోసగుడైన ముస్సోలినీని ఎదిర్చిన గ్రీసును బ్రిటను విడిచిపెట్టగలదా?

ఇంకొక విశేషముంది. అమెరికాకూడా యుగోస్లేవియాకు సాయం చేస్తానన్నది. గ్రీసుకు యిప్పటికే సహాయం చేసింది. అధ్యక్ష రూజువెల్టుగారు తమకు సాయం చేస్తాడని స్వాతంత్ర్యంకోసం యుద్ధంచేసే దేశాలు నమ్మవచ్చును. టర్కీస్థితికూడా క్లిష్టంగానే ఉంది. హిట్లరు టర్కీమీద దండెత్తనన్నాడు. కాని ఆయనమాట ఎవరు నమ్ముతారు? టర్కీ జాగ్రత్తగానే ఉంది. తన్ను తాను రక్షించుకోగలదు. ఇక రష్యా సంగతి : జర్మనీ, యుగోస్లేవియామీద దండయాత్ర చేయడానికి కొద్దిరోజులుముందు, ఒకరిమీద ఒకరు యుద్ధానికి దిగమని, యుగోస్లేవియా-రష్యాలు ఒడంబడిక చేసుకొన్నై. ఇది ప్రాముఖ్యమైన విషయంగా బ్రిటను, అమెరికా దేశాలు తలుస్తున్నై. వీటిలో ఒకదానిమీదికి ఇంకెవరైనా యుద్ధానికి వస్తే, రెండోదేశం ఆ మొదటి దేశంతో స్నేహంగానే ఉండాలని యీ ఒడంబడికలో షరతు. ఈ ఒడంబడిక 5 సంవత్సరాలవరకు అమలులో ఉంటుంది. జర్మనీ, బాల్కను దేశాలలో యుద్ధం వ్యాప్తిచేయడం రష్యాకు యిష్టం ఉండదు. అందుచేత తాను తటస్థంగా ఉండడం తప్పని గుర్తించి, యిట్టి దండయాత్రలను మానమని జర్మనీని హెచ్చరించవచ్చును. కాని రష్యా స్వార్థపరమైన దేశం. యుగోస్లేవియా, గ్రీసు దేశాలు, బ్రిటిషు సైన్యాల సహాయంతో జర్మనీని నిరోధించగలిగితే రష్యా ధైర్యంతో ప్రవర్తించవచ్చును.

# జపాను రాజ్యకాంక్ష

[ఆశియా ఖండం తూర్పు తీరమునకు చేరువగ పసిఫికు సముద్రమునందు చిన్న ద్వీపములు మూడు కలిసి జపాను దేశమయింది. టోకియో నగరం దీనికి ముఖ్య పట్నం. ఈ దేశంలో పరిశ్రమలు ఎక్కువ, ముడి పదార్థాలు తక్కువ; జనసంఖ్య ఎక్కువ జాగా తక్కువ. అందుచే ప్రక్కనున్న ఆశియా ఖండంలో భాగాలను, చుట్టూవున్న చిన్న ద్వీపాలను ఆక్రమించి ఒక చిన్న సామ్రాజ్యం యేర్పరచుకొంది. చీనాలో ఐదు రాష్ట్రాలను ఆక్రమించింది. జపాను ప్రాంతాలను, పసిఫీకు సముద్రంలో తూర్పు దీవులను దూర ప్రాచ్యం అంటారు.]

జపాను విదేశాంగ మంత్రియగు మట్సువోకాగారు రషియా, జర్మను, ఇటలీల రాజధాని నగరాలగు మాస్కో, బెర్లిను, రోము నగరాలుచూచి, తిరిగి టోకియోకు వెడలి పోయెను. ఈతడు బెర్లిను విడచునపుడు జర్మను, ఇటలీ, జపాను మూడు దేశాలు గావించుకొన్న ఒడంబడిక ఉద్దేశాలు తనకిపుడు స్పష్టమయినాయన్నాడు. తన రాక వలన జపానుకి చాలలాభం కలుగునన్నాడు. అంతకు ముందు రోము నగరం విడిచినపుడు త్రిరాజ్యాల ఒడంబడిక ఒక శతాబ్దంవరకు నిలచియుండగలదనెను. కాని మాస్కో నగరంలో రషియా నియంతయగు స్టాలిను, విదేశాంగ మంత్రి మాలటావ్‌గార్లతో మాట్లాడివచ్చిన పిమ్మట, యింత ఉత్సాహంగా మాట్లాడలేదు. అంటే యేదో విశేషం వుందన్నమాట.

హిట్లరు, ముసోలిని, మట్సువోకాగార్లు, ప్రపంచం అంతటిపై తమ రాజ్యాల అధికారం స్థిరం చేసుకోడం యేలాగా అని ఆలోచించి వుంటారు. ఈ ఆలోచనలన్ని రషియాకు యిష్టం వుండవు. ఇతర దేశాలను దౌర్జన్యంగా ఆక్రమించడంలో జపాను, హిట్లరు ముసోలినీలవద్ద పాఠం నేర్చుకోనక్కరలేదు. వారికన్న ముందే ప్రారంభించిది. గత యుద్ధంలో ఇంగ్లాండు మున్నగు ప్రజాప్రభుత్వముల పక్షం వున్న జపాను యిపుడు వారి శత్రువుల పక్షం చేరింది. ఎలామారిందో చూడండి !

దూర ప్రాచ్యమునందు ఇంగ్లాండుని బెదిరించి, అమెరికా యీ యుద్ధంలో చేరకుండా చేయుటకు జపానును ప్రక్కబెదురుగా వుంచాలని జర్మనీ ఊహ. జపానులో పాలకవర్గాలకు తాము ఎక్కువ జాతివారం, ఇతరులను పాలించడానికే పుట్టాం అనుభావం తరతరాలనుండి పెరుగుతూ వుంది. ప్రజలుమాత్రం శాంతినే కోరుతారు. వారి నాయకులు జర్మను నాజీనాయకులను ఆదర్శంగా వుంచుకుంటారు. గత శతాబ్దంలో జపాను ఆధునిక పద్ధతులను అనుసరించి నప్పటినుండి యితర దేశాలపై దాడి ప్రారంభించింది. 1894 లో చీనా పైబడి, పెద్ద రాజ్యాలు అటంకపరుస్తే వెనుకకు తగ్గింది. కొంతకాలం రషియాతో డీకొని, చివరకు 1910 లో కొరియా (ఆశియా ఖండంలో ద్వీపకల్పం) ను ఆక్రమించింది. 1915 నుండి తిరిగి చీనాపై దాడి చేస్తూనే వుంది. 1931 లో మంచూకో రాష్ట్రాన్ని తీసుకొని, 1937 నుండి చీనాపై మరల యుద్ధం సాగిస్తున్నది.

చీనాతో సంబంధంగల పెద్ద రాజ్యాలు యితర చిక్కులందు తగుల్కొన్నపుడే జపాను చొరవ చేస్తూ వుంటుంది. రషియా బలహీనంగా వున్నపుడు కొరియాను తీసుకొంది. 1915 లో గత ఐరోపా యుద్ధం తీవ్రంగా సాగుతున్నపుడే చీనాకు 21 షరతులు దాఖలుచేసి దానిమీద దాడి సాగించింది. యూరోపులో ఆర్థిక మాంద్యం ప్రబలినపుడే మంచూకోను ఆక్రమించింది. ఇపుడు జర్మను వుపద్రవమును ఎదుర్కొనుటకు ఇంగ్లాండు—అమెరికాలు కష్టపడుతూ వుంటే ఫ్రాన్సు, హిట్లరుకి దాసోహం అయిన తరువాత, తనకు దక్షిణంగా ఉన్న యీ పై మూడు రాజ్యాలయొక్క భాగాలను తీసుకొనుటకు జపాను ప్రయత్నిస్తున్నది.

జర్మనీ ఇటలీలతో ఒడంబడిక గావించుకొన్న జపాను, యూరోపులో వాటికి ఉండే ఆధిపత్యంవంటి ఆధిపత్యాన్ని ఆశియాఖండంలో తాను సంపాదించాలని ఆశిస్తున్నది. ఆశియా ఖండంలో క్రొత్త ఏర్పాటు తెచ్చిపెట్టుటకు చీనా, డచ్చి తూర్పు దీవులు, సయాం, ఫ్రెంచి ఇండో చీనాలపై అధికారం సంపాదిస్తేకాని వీలుండదని నియంతలు జపానుకి చెప్పి ఉంటారు. పశిఫికు సముద్రంలో సర్వాధికారిణియై ఇంగ్లాండు అమెరికాలకు ప్రక్కబెదురుగా ఉండాలని జపాను ఆశ,

యూరోపులోవున్న హాలెండును జర్మనీ ఆక్రమించిన పిమ్మట, హాలెండుకి పశిఫికు సముద్రమునందుగల దీవులలో చేపలు పట్టే హక్కు, గనులు త్రవ్వే హక్కు మొదలైన తనకు లాభంగావుండే అన్ని హక్కులు కోరుచు. లండనులో వున్న హాలెండు ప్రభుత్వానికి షరతులు పంపింది. హాలండు దేశం ప్రజలను డచ్చివారంటారు. వారు స్వాతంత్ర్య ప్రియులు. వారందుకంగీకరించలేదు.

## తాయి : ఇండో చీనా.

ఆశయాలో తూర్పుతీరాన ఉన్న ఇండో చీనా చేరువగా తన నౌకాదళాన్ని జపాను వుంచి, సయాంచేరువను బ్రిటిషు వారు సైన్యాలను దింపుతున్నారని అసత్యవార్తను ప్రకటించెను. సయాం (ఇపుడు తాయిలాండు అంటారు) ఇండో చీనాలు ఇరుగు పొరుగు రాజ్యాలగుటచే వాటికి సరిహద్దు తగవులు కలవు. ఆ తగవులను పరిష్కరించడానికి మధ్యవర్తినిగ జపాను బయలుదేరింది. తాయిలాండు ప్రభుత్వంపై జపానుకి చాల పలుకుబడికలదు. ఆ దేశంలో వున్న రేవులను తీసుకొని బ్రిటిషు వారి సింగపూరు నౌకాదళకేంద్రానికి ప్రతిగా ఒక నౌకాదళ శిబిరాన్ని అచట కట్టాలని చూసింది. కాని తాయి ప్రభుత్వం అంతసులభంగా జపాను మాయలోపడదు. వీలయినంతవరకు జపాను అధికారాన్ని ధిక్కరిస్తుంది.

## చీనాలో జపాను ఆటలు సాగలేదు.

ఇతర దేశాలపై అధికారం చెలాయించడానికే "ఆశియాలో క్రొత్తవిధానం" అనే పెద్దకబురులు జపాను చెపుతున్నదని చీనాకు తెలును. అందుచే మార్షలు చియంగు కాయి షేకు నాయకత్వమున, చీనా, జపానుదాడిని ఎదిరిస్తున్నది. నాలుగేండ్లలో జపాను సైన్యాలను చిత్తుచేయడమేకాక, తన బలం అధికం చేసుకుంటున్నది.

ఇంగ్లాండు, అమెరికా, రషియాలు చీనాకు ఆయుధాలు సప్లయిచేస్తున్నాయి. బర్మా, చీనా రోడ్డును ఇదివరకు ఇంగ్లాండు ప్రభుత్వం మూసివేసినా, తరువాత తెరచుటచే చీనాకు రంగూను రేవునుండి యుద్ధసామగ్రి తెంపులేకుండా రాగలదు. అందుకే జపాను ప్రధానియగు కొనాయి రాకుమారుడు "ఐదేండ్లు కావస్తున్నా చీనాలో మాయుద్ధం ముగిసేటట్లు అగపడదు. కోట్లకొలది ద్రవ్యం ఖర్చయింది, వేలకొలది సైనికులు చనిపోయినందుకు సిగ్గవుతున్నది" అని యిటీవల ఒప్పుకున్నాడు. చీనా సైనికులు పాశ్చాత్య దేశాలలో తరిఫీదయినారు. ఎంత శ్రమకైనా ఓరుస్తారు. జపానువారు అట్లుకాదు. జపాను యుద్ధపుఖర్చులుకూడ విపరీతంగా పెరిగిపోతున్నాయి. దేశంరాబడి అంతా చీనాలో చేసే ఒక యేడాది యుద్ధానికి సరిపోతుంది. ఇక దేశం దివాలా తీయవలసిందే.

## రషియా వైఖరి.

జపాను పొరుగునే రష్యా ఎప్పుడు జాగ్రత్తగా ఉంటున్నది. రషియానియంతయగు స్టాలిను చాల తెలివైన వాడు. తనకు లాభంలేనిది జపానుతో ఎట్టి ఒడంబడిక చేసుకోడు. చీనాయందున్న తన చీనాతూర్పు రైల్వేను 1935 సంవత్సరములో రషియా జపానుకి అమ్మివేసింది. చీనాలో దక్షిణ భాగం పైనే జపానుకి ఆశకలదని అపుడు రషియా పొరపడింది. కాని త్వరలో నిజంతెలిసింది. మంచూరియాలోను జహాలులోను సైన్యాలకవసరమగు రైలు మార్గములను జపాను నిర్మించి, రషియా సముద్రాలలో గూడ చేపలుపట్టే మిషతో నౌకలప్రయాణం సాగించింది. అంతట, ఎట్టి ప్రమాదాన్నయినా ఎదురు కోడానికి రషియా గట్టి సైన్యాన్ని దూర ప్రాచ్యంలో ఉంచింది. చీనా జపానును ఎదిరించగలిగినన్నాళ్లు చీనాకు, ఆయుధ సహాయం చేస్తూ ఉంటానని స్టాలిను తెలిపెను.

దూరప్రాచ్యంలో బ్రిటిషు సామ్రాజ్యం, ముఖ్యంగా ఆస్ట్రేలియా అవసరమగు చర్యతీసుకుంటున్నాయి. మల యా దక్షిణకొసనున్న సింగపూరు నౌకాదళాశ్రయానికి, క్రొత్తసైన్యాలను పంపాయి. జపాను, తనకు దక్షిణంగా ఉన్న దీవులను ఆక్రమించడానికి ప్లాను వేసింది. తన దక్షిణ నౌకాదళాధిపతి ఓనుమిగాలెక్కి పోవుచున్న విమానం విరిగిపడినపుడు, యీ ప్లానులు బ్రిటిషువారికి దొరి కాయి. ఈ దక్షిణదాడి జపాను సాగించినచో బ్రిటను ఆస్ట్రేలియాలకు అమెరికా సహాయం చేస్తుంది. పశిఫికు మహాసముద్రంలో అమెరికా నౌకాదళం స్థిరంగా ఉంచ బడింది. సింగపూరులో బ్రిటిషువారి దళముంది. ఇవన్ని తమ రక్షణకొరకేగాని, యితరులను కొట్టడానికి కాదు. కావున హిట్లరుకి సహాయం చేయడానికి ఆయన ప్రోత్సాహాన దూరప్రాచ్యాన జపాను తొందరపడి చేయిచేసుకొన్నచో బాగా అనుభవిస్తుంది.

## ముగింపు.

ఈ రీతిగ ఉత్తరాన రషియా, చీనాలు, తూర్పున అమెరికా, దక్షిణాన బ్రిటనులు సిద్ధంగా ఉన్నాయి. ఇవి కాక ఇండోచీనా డచ్చిదీవులుకూడ కొంత నౌకాదళం కలిగి ఉన్నాయి. ఇదివరకే జపాను నాలుగేండ్లాయి చీనాతో యుద్ధంచేసి అలసిఉంది. దేశంలో తిండికి చాలదు, నెల రోజులాయి బియ్యంకూడా ప్రతివారికి మితంగా లెక్క ప్రకారం యిస్తున్నారు. ప్రజలకున్న బంగారం అంతా ప్రభుత్వం నిర్బంధంగా తీసుకుంది. చమురు, ఇనుము ప్రత్తి యిలాంటి ముడి పదార్థాలకు ఇంగ్లాండు, అమెరికాల పై ఆధారపడియున్నది. పెట్రోలు అమెరికానుండి జపానుకి పోరాదని అపుడే అమెరికా ప్రభుత్వం ఆజ్ఞా పించింది. కావున జపాను దక్షిణాన్న దాడికి దిగినచో పై చిక్కులన్ని గమనించవలసి ఉంటుంది.

---

# 9 నెలలలో కోటి రూపాయల యుద్ధ నిధి

---

## మదరాసు గవర్నరుగారి కృషి ఫలితం.

యుద్ధంలో బ్రిటిషు విజయానికి సహాయం చేయడానికి యీ రాష్ట్రంలో ప్రజలు చందాలివ్వాలని మదరాసు గవ ర్నరు సర్ ఆర్థరు హోపుగారు గత జూలై 4 వ తేదీన విన్నపం ప్రకటించేరు. ఆనాటినుండి ప్రతి జిల్లాలోను ఉద్యో గులు, ఉద్యోగేతరులు కృషిచేసి వసూలుచేసేరు. ఈ ఏప్రిల్ 4 వ తేదీకి సరిగా తొమ్మిది నెలలలోనే చందా కోటిరూపాయ లను మించి అనగా రూ 1,03,36,457-1-3 లు వసూ లయింది. అన్ని జిల్లాలకన్న (1) గుంటూరు అత్యధికంగా 9 లక్షల 70 వేలు యిచ్చింది. తరువాత (2) మదరాసు, (3) మధుర. ఈ సొమ్ములో 88 లక్షలు ఇంగ్లీషు ప్రభుత్వం వారికి ఇప్పటికి పంపబడింది. వారు 45 యుద్ధ విమానాలు కొన్నారు. అందు గుంటూరు పేరిట ఐదున్నాయి. ఇవి బ్రిటిషు విమానదళంలో చేరి యుద్ధం చేస్తున్నాయి.

యుద్ధనిధి వసూళ్లలో యితర రాష్ట్రాలన్నింటిని మద రాసు మించిపోయి ఆదర్శప్రాయంగా ఉండటం గర్వింపదగ్గ విషయం. ఈ ఘనకార్యాన్ని స్మరించి ప్రజలకు మరింత ఉత్సాహం కలిగించడానికి 5 వ తేదీన అన్ని జిల్లాలలో ఉత్స వములు, రాజు, రాణి పటాలతో ఊరేగింపులు, సాయంకాలం

బహిరంగ సభలు జరిగినాయి. సభలలో వైస్రాయి గవర్నరు గార్ల సందేశములు చదివేరు.

వైస్రాయిగారి సందేశంలో మదరాసును అభినందిం చుచు, ఇండియా అంతా మదరాసునుగూర్చి గర్వించుచున్న దనియు, యుద్ధ విజయమునకు తోడ్పడు కార్యములకు దీనివలన ఎంతో ప్రోత్సాహం కలిగిందనియు తెలిపేరు.

గవర్నరుగారి సందేశంలో, రాష్ట్రంలో పేదవారు, గొప్ప వారు, రైతులు, కార్మికులు, అన్ని మతాలవారు విరివిగ బల వంతంలేకుండా మనస్ఫూర్తిగా చందాలిచ్చి త్వరలో కోటిని మించిపోయేటట్లుచేయుటనుబట్టి, ప్రజలకుగల రాజభక్తి వెల్ల డయిందన్నారు. చందా లివ్వడమేగాక డిఫెన్సు ఋణ పత్రాలనుగూడ ప్రజలు ఎక్కువగ కొన్నారు. ఇంకను యీ రీతిగా చందా లిస్తూనే ఉండాలనికోరిరి. జిల్లాలలో ఉద్యోగులును, యుద్ధ సంఘ సభ్యులును చాల కష్టపడినందుకు అభినందించేరు. గ్రామాలలో కొందరు తప్పుడు ప్రచారం చేస్తున్నారనియు, దానికి విరుగుడుగ గ్రామాలలో సరియగు సమాచారం అభిప్రాయాలు తెలిపేటందుకు పఠనమందిరాలు ఎక్కువగ స్థాపించబడుచున్నాయనియు చెప్పేరు. ఆఫ్రికా యుద్ధ రంగంలో భారతీయ సైనికులు అత్యద్భుతంగా పోరి విజయాన్ని ప్రశంసను పొందినందుకు మనమంతా గర్వింప వచ్చును. మదరాసు యువకులుగూడ సైన్యంలోచేర తమ పూర్వీకుల సాంప్రదాయం కాపాడాలని గవర్నరుగారు కోరినారు.

మదరాసులో యీ కోటినిధి ఉత్సవం సందర్భమున ఆదివారంనాడు ఉదయం నగరం అన్ని ప్రాంతాలందు వేల కొలది పేదలకు అన్నదానంచేసేరు. గవర్నరుగారు, అడ్వై జరులు కొన్నిచోట్లకు స్వయంగాపోయి పేదవారిని చూచేరు. సాయంకాలం సముద్రతీరాన విజయ స్మారక చిహ్నంవద్ద ప్రత్యేకంగా వేయబడిన పందిరివద్దకు, గవర్నరు దంపతులు నిండు పేరోలగంబున గుర్రబ్బండీలో, గుర్రాలపై సైనికులు ముందు నడచుచుండగా వచ్చిరి. సుమారు లక్షమంది ప్రజలు చూడవచ్చిరి. మదరాసులో ఉన్న సైన్యం, సివిక్ గార్డులు, రెడ్‌క్రాసు దళాలు, కవాతుచేసి గవర్నరుగారిముందుగ పోవ గ, వారు సలాములందుకొన్నారు. పైన యుద్ధ విమానాలు ఎగురుచుండెను. కొన్ని విమానాలు ఆకస్మికంగా దిగడం, తిరిగి లేవడం, చిత్రంగా ఎగరడం, ఫల్టీలు వేయడం చూపించాయి.

సోమవారం సాయంకాలం సెనేటు మందిరంలో బహి రంగ సభ జరిగింది. గవర్నరుగారు అధ్యక్షత వహించవలసి యుండెను. వారికి అస్వస్థగనున్నందున వారి భార్యమాత్రం వచ్చింది. సర్ జార్జి బోగుగారు అధ్యక్షత వహించి, తొలినాడు ఎక్కువ శ్రమపడినందున యీ తొమ్మిది నెలలు ప్రతి తాలూకాలోను సంచారంచేసి, నిధి వసూలునందు విరామంలేకుండా పనిచేసినందున గవర్నరుగారికి కొంచెం అస్వస్థగనుండియుండును, వారు త్వరలో ఆరోగ్యం బడయ గలరనిరి. సభలో ఉపన్యసించిన పెద్దలంతా గవర్నరుగారి కృషియే యీ నిధి విజయానికి కారణమని వారిని ప్రశంసిం చిరి. (అదివరకు గవర్నరుగానుండిన) సర్ కె. వి. రెడ్డి నాయుడుగారు యీ నిధి అన్ని తరగతులు, జాతులవారి వద్దనుండి వసూలు చేయడంవలన గవర్నరుగారు రాష్ట్రం లో ఐకమత్యం చేకూర్చేరనిరి. రెండోది, దేశాభిమానం అంటే దేశం కష్టంలో ఉన్నపుడు తోడ్పడడం అని క్రొత్త పాఠం నేర్పేరన్నారు.

ఎం. సి. రాజాగారు (హరిజన నాయకులు) ప్రజలింతా తిరుపతి హుండీలలో వేసినట్లు భక్తితో యీ నిధికి చందా లిచ్చేరన్నారు. ఈ నిధి ఎంతో దూరమగు మార్గంలో ఒక మైలు రాయివంటిది, యిలాంటి కోట్లు ఎన్నో వసూలు కావాలన్నారు.

ఆర్. డి. డెనిస్టనుగారు, మనతోడివారు లండనులోను యితరచోట్లను బాంబులవల్ల యిళ్లుకాలి చస్తూఉంటే మనం సౌఖ్యపడడానికి అర్హత లేదన్నారు. మదరాసు యిచ్చిన నిధినుండి కొన్న బాంబరు, విమానాలే మటపంవద్ద ఇటలీ నౌకలను ముంచియుండవచ్చును. నాజీ, ఫాసిస్టు జాతులకు ఆత్మలు లేవు. వారి సైనికులు నవ్వుచున్నట్లు ఒక్కబొమ్మైనా చూచినవారున్నారా అని అడిగేరు.

సర్ జార్జి బోగుగారు, యీ నిధి వసూలువలన రాష్ట్రంలో మంచి ప్రచారం జరిగిందన్నారు. ఇందుకు తోడ్పడినవారికి, చందాలిచ్చిన వారందరి కీ కృతజ్ఞ తెలి పారు. జర్మనీని పూర్తిగ ఓడించడానికి యింకా ఎక్కువ చందాలిచ్చి సహాయం చేయాలని ప్రజలను కోరేరు.

(అదివరకు గవర్నరుగానుండిన) సర్ మహమ్మదు ఉస్మాను గారు మహమ్మదీయు లందరికి యీ యుద్ధంలో సహాయంచే యుట మతవిధి అన్నారు. ఎందుకంటే వారి పుణ్యక్షేత్రా లున్న మహమ్మదీయ దేశాలను హిట్లరు బెదరిస్తున్నాడు మహ మ్మదీయులంతా అందుకే బ్రిటిషువారికి సహాయం చేస్తున్నారని చెప్పిరి.

# డోవరు విమాన యుద్ధం.

ఇంగ్లండు దక్షిణతీరాన డోవరు అను రేవు స్థలంవుంది. ఇక్కడనుండి ఫ్రాంసుతీరం 20 మైళ్లు; మధ్యసముద్రం ఇంగ్లండు దీవులకు ఈవూరు ద్వారం వంటిది. ఇక్కడ పెద్ద స్టీమరులన్ని విడిదిచేయడానికి హార్బరుఉంది గత జూలై నెలలో యీ రేవుపైకి జర్మను విమానాలు 80 వచ్చి బాంబులువేశాయి. డోవరును రక్షించడానికి సిద్ధంగా ఉన్న బ్రిటిషు విమానాలు వెంటనే వాటిని ఎదుర్కొని యుద్ధంచేసి తరిమివేశాయి. ఈ యుద్ధం ఎలాగ జరిగిందో చూపే పటం, పైన గలదు. డోవరు పై జరిగినంత తీవ్రంగా విమాన యుద్ధం యింకెక్కడా జరగలేదు.

ఒకనాడుదయం ముందుగ ఒకజర్మను విమానంవచ్చి డోవరు పై ఎగురుచుండెను. వెంటనే 30 జర్మను బాంబు విమానాలు, వాటిని రక్షించుటకు వెనకాల 50 ఫిరంగి విమానాలు వచ్చినాయి. గుంపులు గుంపులుగ చేరి కెరటాలవలె బాంబులువేశే విమానాలు డోవరు రేవులోనున్న స్టీమరులపై ఎగురుచు ఒక్కపూపున సూటిగమీదనుండి క్రిందకి దిగుచు బాంబులువేసి వాలుగాలేచి పోవుచుండెను. వాటికి కొంచెంపైన మరింత ఎత్తుగా ఫిరంగి విమానాలు ఎగురుచు కాపలా కాయుచుండెను.

తాామువచ్చి బాంబులువేసిన తరువాత బ్రిటిషు విమానాలు ఎదిరించవచ్చుటకు కొంత వ్యవధి ఉండునని, జర్మను లెంచిరి. కాని సూటిగదిగిన విమానాలు బాంబులువేసి లేచి పైకెగురులోపునే ఒడ్డునున్న బ్రిటిషు ఫిరంగి విమానాలు పైకిలేచి యుద్ధం ప్రారంభించాయి. వెంటనే రెండు జర్మను బాంబు విమానాలు పడిపోయినాయి. జర్మనులు బాంబులువేస్తూవుంటే, అవి విమానందిగువ కన్నంలోనుండి జారిపడడం, క్రింద నీటిలో పడి నీళ్లు చాల ఎత్తుగ ఉబకడం, హార్బరులోవున్న పడవలు స్టీమరులు కెరటాలతో కదలి ఊగడం, ఒడ్డునున్నవారికి స్పష్టంగా అగుపడుచుండెను. బాంబులు ప్రేలే ధ్వని ఫిరంగుల మోతతో ఒడ్డునవున్నవారి చెవులు చిల్లులుపడి, ఇండ్లు గజగజ వణికినట్లుండెను. ఆకాశంపైన బ్రిటిషు విమానాలు శత్రువుల విమానాలు, ఒకదాని నొకటి, తప్పించుకొనుచు వెంటాడుచు క్రిందకు మీదకు, గుండ్రంగా సున్నాలు చుట్టినట్లు తిరగడం, క్రిందవున్నవారికి అగుపడుచుండెను. జర్మను విమానాలు, ఎండు ఆకులు రాలినట్లు రాలిపోయాయని చూచినవారొకరు చెప్పిరి. బ్రిటిషువారి ఫిరంగి విమానాలు ఒక జట్టుగా పోయి జర్మను ఫిరంగుల విమానాలను మూడింటిని ఒక బాంబు విమానాన్ని ముందు పడగొట్టెను. తరువాత మరికొన్ని విమానాలు పోయి మూడు జర్మను బాంబరులను ఒక ఫిరంగి విమానాన్ని పడగొట్టెను. ఒక బ్రిటిషు విమానం మూడు జర్మను బాంబరువిమానాలను ఎదిరించి ఒకదాని తరువాత నొకటిని పడగొట్టెను. ఇంకోటి రెండు జర్మను విమానాలను కూల్చి, తీరాన అతి దిగువగ ఎగురుచుండగ, దానిపై గుండ్లు తగిలిన కన్నాలు చాల దిగువనుంచి కనబడ్డాయి. కాని, అందులో వైమానికుడు, గెలిచినట్లు సూచించుచు చేయి ఊపెను.

ఒక అర్ధగంటసేపు ఆకాశంలో హోరున విమానాల ధ్వని, డాండూం అను ఫిరంగుల మోతలు వినబడుచు భీభత్సంగా ఉండెను. వచ్చిన 80 జర్మను విమానాలలో 17 వరకు పడిపోయినయి గుంపులుగ వచ్చినవి చెదరిపోయి సముద్రం దాటి, పారిపోవలసివచ్చెను. బ్రిటిషు విమానాలు వాటిని వెంటాడి తరిమి, తిరిగివచ్చి యింకో అరగంటవరకు డోవరుపై ఎగిరి, తరువాత విమానాశ్రయం చేరినవి.

ఇట్లు ఈ యుద్ధంలో శత్రువులకే ఎక్కువ నష్టంకలిగెను. వారి విమానాలు తరిమి వేయబడినవి. తీరాన ఒక్క బాంబు కూడా పడలేదు. బ్రిటిషువారివి, ఒక విమానం పడిపోయి రెండు కొంచెం చెడినవి.

# ఈ యుద్ధం క్రైస్తవ మతంకోసమేకాదు.

జర్మనుల చర్యలు క్రైస్తవమత సిద్ధాంతములకు విరుద్ధంగా ఉన్నాయికనుక, వాటిని నిరశించుచు ఆంగ్లేయ పెద్దలు ఉపన్యశించుచున్నారు. క్రైస్తవ సైన్యాలకు, క్రైస్తవేతర సైన్యాలకు యుద్ధం జరుగుతున్నాదని యిటీవల క్రైస్తవమత గురువగు కాంటరుబరీ ఆర్చిబిషపుగారు కూడ అన్నారు. జర్మనుల రాక్షస కృత్యాలు క్రైస్తవ మతమునకేగాక, బ్రిటిషు సామ్రాజ్యంలోవున్న ఇతర హిందూ, బౌద్ధ మహమ్మదీయ తదితర మతాల సిద్ధాంతములన్నింటికి విరుద్ధంగా ఉన్నాయి. ఆయా మతాలవారు బ్రిటిషు సైన్యాలతో కలసి యుద్ధరంగంలో తమ ప్రాణాలను విడుస్తున్నారుకూడాను. అందుచే యీ యుద్ధం కేవలం క్రైస్తవమతాన్ని ఉద్ధరించడానికే జరుపుతున్నామని ఇంగ్లీషు పెద్దలనడం ఇండియాలో వారికి కష్టంగాఉంటుంది. అంతేకాక యుద్ధానంతరం యూరోపులో క్రొత్తపద్ధతి స్థాపించడంకూడ యుద్ధాశయం అని చెప్పినపుడు, అది అన్ని దేశాలకు వర్తింపజేయాలి. కనుక ఆర్చిబిషపుగారు క్రైస్తవ మతాలకు క్రైస్తవేతర మతాలకు యుద్ధం జరుగుతున్నదనడంలో క్రైస్తవ ప్రతికూల మతాలకని ఉద్దేశించియుందురు. అది నిజమేనాయని హెచ్. ఎస్. పోలకుగారు ఆర్చిబిషపుగారికి వ్రాసి కనుక్కున్నారు. నిజమే, క్రైస్తవ మతాలేగాక యితర మతాలు, యితర దేశాల శ్రేయం కొరకుకూడా యుద్ధం జరుగుతున్నదనే వారు ఉద్దేశించిరని జబాబువచ్చింది. ఈ విషయం బ్రిటిషు ప్రధానియగు చర్చిలుగారికి వ్రాస్తే, "యీ యుద్ధంగూర్చి చేసే ప్రకటనలలో క్రైస్తవమత సిద్ధాంతాల కొరకేగాక, నాజీ దుర్మార్గాన్ని నిర్మూలించడాన్ని కోరే యితర మతాలకొరకుగూడ యుద్ధం జరుగుచున్నదని అర్థం చేసుకోవాలి" అని జబాబు వ్రాసేరు. ఇండియా మున్నగు క్రైస్తవేతర మతాలుగల సామ్రాజ్య దేశాలన్నికూడ యీ విషయం గుర్తించాలని పోలకుగారు ప్రకటించేరు.

సలహా : ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు క్రమముగా భద్రపరుచుకొనుడు.

[మదరాసు సమాచారముల డైరెక్టరుగారు వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS: PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.